# శ్రీనిర్మలానంద పిల్లలమర్రి భీమయార్యులవారి మండలారాధన 24-9-2013 సందర్భముగా

# 'వారు పరిపూర్ణభావజ్ఞులు'

యథార్థబోధోపదేశిక డా॥ కూన దయానంద స్వామి
ప్రధాన కార్యదర్శి, శ్రీమదచలగురుపీఠ రాజయోగాశ్రమ సేవాసమాఖ్య
email Id. sevasamakhya@gmail.com
facebook Id. achalaguru peetam

శ్రీనిర్మలానంద పిల్లలమర్రి భీమయార్యులవారిది, మాది ఒకే గ్రామము.శ్రీభక్తానంద తూడి దేవమాంబగారిది కూడా మా నర్సాపురం శివారులోని పాపయ్యపల్లె. మావూరికి అరకిలోమీటరు దూరంలో ఉంటుంది. నేను పుట్టకముందు మానాన్నగారైన శ్రీ అచలానంద కూనలక్ష్మణార్యులకు శ్రీభక్తానంద దేవమాంబగారివద్ద ఉపదేశం ఇప్పించిందికూడా శ్రీభీమయార్యులవారే. శ్రీదేవమాంబగారే నాకు పేరు పెట్టినారట. అప్పటికే శ్రీభీమయార్యులవారి కుటుంబము పాలంపేటలో ఉండేది. శ్రీభీమయార్యులవారి కుటుంబములతో మా కుటుంబానికున్న అనుబంధం వలన శ్రీభీమయార్యులవారిని మామయ్యఅని, శ్రీమతి ఉత్తరాంబగారిని అత్తమ్మ, అని పిలిచేవాన్ని. నాకు 15వ ఏట ఉపదేశం అయిన తరువాత శ్రీతంగళ్ళపల్లి రాజేందర్‌గారి సహచర్యంవలన పెద్దలను అమ్మ, అయ్యఅని ఇతరులను అక్కయ్య, అన్నయ్య అని పిలవడం నేర్చుకున్నాను.

నర్సాపురంలో మాతృశ్రీదేవమాంబగారికి ప్రత్యేక గౌరవ మద్యాదలు ఉండేది. గ్రామ ప్రముఖులంతా వారి శిష్యులే.మా నాన్నగారు,శ్రీజోడు కొమురయ్యగారు,శ్రీచిగురు రామస్వామిగారు,శ్రీచాల్లేటి నర్సిరెడ్డిగారు,శ్రీతడక రామస్వామిగారు, శ్రీరాయబారపు వీర్యగారు, శ్రీమంతెన బొంద్యాలుగారు, శ్రీకొంక మల్లయ్య, వెంకట్రాములుగారు, శ్రీబాలాజి సమ్మయ్య మెదలగువారు మాతృశ్రీదేవమాంబగారి వద్ద ఉపదేశం పొందియున్నారు.

1974లో శ్రీదేవమాంబగారి నిర్యాణానంతరము నర్సాపురంలో శ్రీభీయార్యులవారికి అలాంటి ఆధరణేఉండేది. మాతృశ్రీదేవమాంబగారి తరువాత వీరే ఉపదేశాలిచ్చేవారు. 1978లో మా నాన్నగారికి, మరియు శ్రీబోధానంద గూడూరు చెన్నస్వామిగారికి, సేవాసమాఖ్యవారు అధికారము ఇచ్చినారు. అప్పటినుండి శ్రీభీమయార్యులు, శ్రీచెన్నస్వామార్యులు, మానాన్నగారైన లక్ష్మణార్యులు త్రిమూర్తుల్లాగా ఉండేవారు. వీరికితోడుగా శ్రీనిత్యానంద వాడపల్లి ఆనందంగారు. రామలక్ష్మణులాంటి ఈ నలుగురికి శ్రీతంగళ్ళపల్లి రాజేందర్‌గారు హనుమంతుడిలా తోడై సంప్రదాయానికి సేవజేసినారు. వీరికృషివల్లనే నేడు వరంగల్ జిల్లాలో సంప్రదాయం వ్యాప్తిచెందినది.

శ్రీభీమయార్యులవారు, మానాన్నగారు శ్రీమేడం సమయ్యగారి(నర్సాపురం) డ్రామా గ్రూపులో పాత్రదారులు. ఆ కాలములో భాగవతాలు వేసేవారిపై విపరీతమైన క్రేజ్ ఉండేది. పాలంపేటలోని ప్రసిద్ధమైన రామప్ప దేవాలయములోనూ శ్రీమేడం సమ్మయ్యగారి అధ్వర్యంలో వీరే ఖడ్గాలువేసుకుంటూ శరభఘోషతో అగ్నిగుండాలు దాటేవారు.

అచలబోధ ఊరేగింపుల్లోను శ్రీభీమయార్యులు, శ్రీలక్ష్మణార్యులు ఆటపాటలతో వరంగల్ కీర్తిని నలుదిశల చాటారు. శ్రీచెన్నస్వామిగారు, శ్రీరాజేందర్‌గారు ఆధునికతను జోడించి కీర్తనలుపాడి ఉద్రూతలూగించేవారు. వీరి పాటులు, శ్రీవాడపల్లి అనందంగారి మాటలు, అందిపుచ్చుకున్న నేటితరం శ్రీబండిచక్రపాణిగారు, శ్రీనరి మేటి బుచ్చివీర్యగారు, శ్రీబుచ్చిరాములుగారు, శ్రీబూర్గులబాబురావు మొదలగువారు సాంప్రదాయాన్ని భుజ స్కందాలపై వేసుకొని, బాధ్యతలను కొనసాగిస్తున్నారు.

ఎందరున్నా శ్రీభీయార్యులు లేనిలోటు పూడ్చలేనిది. ముఖ్యంగా వారి కుటుంబ సభ్యులది మరీ దయనీ యమైన స్థితి. శ్రీపిల్లమర్రి వెంకటేశ్వర్లుగారికి, తనపుత్రులైన శ్రీపరిపూర్ణం, శ్రీశివన్న, శ్రీరామన్నలకు అధికారం ఇచ్చినారు. అలాగే తన సోదరులైన శ్రీపిల్లలమర్రి మొగిలయ్యగారికి, శ్రీసమ్మయ్యగారికికూడా ఇవ్వాల్సింది.

నేను శ్రీభీమయార్యులవారిని, శ్రీచెన్నస్వామిగారిని మరియు మానాన్నగారిని ముగ్గురిని స్వగురువులుగానే భా వించేవాన్ని. నేటికి వారి ముగ్గురి పోటోనే నిత్యం అరాధిస్తున్నాం.

నేను మెడికల్ కాలేజీలో చదువుచున్న రోజుల్లో కాలేజికి శ్రీభీమయార్యులవారు,శ్రీమతి ఉత్తరాంబగారు, శ్రీమతి జ్ఞానేశ్వరిగారు, శ్రీగురుమూర్తిగారు వైద్యంకొరకు హాస్టల్‌కు వచ్చేవారు. నాతోటి విద్యార్థులకు శ్రీభీమ యార్యులవారిని మాగురువుగారని పరిచయంచేస్తే, నరములస్థులు చర్మనఖరోమ మాంసముల్, ఇడ పింగళ యు సుషున్మవంటి పద్యాలు చదివి, వైద్య విద్యార్థులకు విస్మయం కలిగించేవారు.

నాకు శ్రీరాజేంద్రన్నతో స్నేహం కారణంగా, శ్రీభీమయార్యులవారు, మేము పాజిటివ్, నెగటివ్ కరంటు తీగల్లా మారిపోయాము. కలిమిడిలో విద్యుశ్చక్తిగా మారే వాళ్ళము. అయినా నీవు నా వారసుడివి. నా పిల్లలందరిని దగ్గరకు తీసుకొవాలి అనిచెప్పేవారు. 1986 సేవాసమాఖ్యతో విభేదము, అధికారాలు ఇచ్చే సమయములో, ఆశ్రమ ప్రారంభ, నిర్మాణము, జులైవాడ సత్సంగఘటన, శ్రీదాసిసాంబయ్యవనమాలల సంసారము మొదలగు అనేక విషయాలలో తేడాలు వచ్చినప్పటికి పెద్దమనసుతో ప్రవర్తించేవారు.అందుకే వారిగురించి తెలియాలంటే వారు ఎదుర్కొన్న సమస్యలను విశ్లేషించాలి.

ఎవరికైనా కఠిన సమస్యలు ఏర్పడినప్పుడు వారు ప్రవర్తించినతీరులోనే వారియొక్క మానిక స్థితిని అర్థం చేసు కోగలము. నాకు తెలిసి ఆధ్యాత్మిక జీవితములో శ్రీనిర్మలానంద పిల్లలమర్రి భీమయార్యులవారు ఎన్నొ సన్మా నాలను సత్కారాలను అందుకున్నారు. వారికి లభించిన అధరణ గౌరవము ఈ బోధలో ఎకరికి దక్కలేదంటే అతిశయోక్తికాదు.

## క్షమాగుణము

క్షమించడము అనేది మనకు ఎవరైనా కీడుతలపెట్టినా వారిని ఏమి అనకుండా ఉపేక్షించడము.
'చంపదగినయట్టి శత్రువు తనచేతచిక్కెనేని పొసగమేలు చేసి పొమ్మనుటేచాలు' అన్నారు వేమన.
ఇతి క్షమాగుణానికి పరాకాష్ట. గీతలో
శ్లో॥ ఉదాసీనోవదాసీనో గుణైర్యో న విచాల్యతే ।
గుణావర్తంత ఇత్యేవా యో2వతిష్టంతి నేంగతే॥భ.గీత.14-23॥

త్రిగుణ నిర్మితములైన త్రికరణవ్యాపారములకు చలించక గుణాతీతుడుగా, ఉదాసీనుడుగా, సాక్షిగానుండవాడు అద్వైతములో స్థితప్రజ్ఞుడు. అచలబోధలో స్థితిపురుషుడు అదుకుభిన్నం.

కం॥ ఈరీతి స్థితిగలిగిన। నేరుపుశాలితరజనుల నిందాస్తుతులన్।

తారేగి చేయడెన్నడు। వారలు మరి చేసిరేని వలదాని యనడూ॥ చెవియొగ్గి కావలెనాని వినడూ॥

**కావలెనాని చెవియొగ్గి వినడూ** అనగా సాక్ష్యత్వము వహించడు. ఎరుగుట జ్ఞానము, దానను జరిగేపని కర్మము, కాబట్టి ఎరుగుటే సాక్షి, సాక్షివై ఉదాసీనుడుగా ఉండటమంటే సన్యాసితో లేదా చచ్చినవానితోసమానం. వాడు ఏ ఆశ్రమధర్మాలను నిర్వహించలేడు. ఎరుక రూపుడై లేదా సాక్షిరూపుడై ఉదాసీనుడుగా ఉండడటం అద్వైతమైతే, ఆ ఎరుకను లేదా సాక్షిని రహిరతంచేసి గురుకాక్యరీతిగా నడుచునేవాడు అచలుడు.

ఈ విషయం, సరిగ్గా శ్రీభూమానంద నల్లా ఉపేందర్‌గారి విషయములో ఇదే జరిగింది. శ్రీఉపేందర్‌గారు 1972లో పరిపూర్ణాచల వేదాంత పరిషత్ తరపున శ్రీభీమయార్యులచే రచించింపబడిన, **'నిర్మలానంద తత్వ దర్శిని'**(http://archive.org/details/NIRMALANANDATATVADARSHINI) ప్రచురించినారు. 1974లో **'అచల వేదాంతాచార్యులు'** (http://archive.org/details/AchalaVedantacharyulu) అనేపేరుతో శ్రీభీమయార్యులను, దూషిస్తూ, దుర్భషలాడుతూ పుస్తకములో వ్రాసినారు. తరువాత శ్రీఉపేందర్‌గారి భావముచెడి నిర్మలానంద తత్వదర్శిని లోని పద్యభాగము నాదేనని ప్రకటించుకున్నారు. అయినా శ్రీభీమయార్యులవారు శ్రీఉపేందర్‌గారిని పళ్ళెత్తు మాట అనలేదు. తప్పును తెలుసుకున్న శ్రీఉపేందర్‌గారే, నేడువారి సేవలో నిమగ్నమైనారు. ఇదొక పరిపూర్ణ భావమునకు నిదర్శనము.

**లింగం గురించి**

లింగమంటే గుర్తు. **'లీనం గమయతీతి లింగం'** అవ్యక్తంగా ఉన్నదానిని బయటకుతీసి వ్యక్తంచేసేది లింగం. మనోబుద్ధులతో కూడిన 17 ఇంద్రియాలే లింగశరీరం. మనోబుద్దులైన అనాత్మే అత్మను గుర్తింపజేసేది. అందుకే

అసతోమా సద్గమయా
తమసోమా జ్యోతిర్గమయా
మృత్యోమా అమృతంగమయ

అన్నారు. అసత్తైన జగత్తు నుండి సత్తునకు, తమస్సైన అజ్ఞానమైననుండి వెలుగునకు, మృత్యువైన మరణము నుండి, మరణంలేనిస్థితికి చేరుకోవాలి.

అద్వైతములో దృశ్యము అనాత్మ, దృక్కు ఆత్మ. మనసునుండి అవ్యక్తమువరకు అనాత్మే. అచలబొధలో ఈ రెండూ కలిపి ఎరుక. **'అంగము లింగము కలుసుటె లింగశరీరంబని లెక్కకు వచ్చెన్'** అని లింగ నిర్వచన భిన్నంగా ఉంటుంది. ఎరుకే లింగశరీరము, దీన్ని ఉళ్ళక్కిచేయడమే అచలబోధ అంతేకాని లింగం అనగానే సామాన్యంమైన మానవులలాగా భౌతిక విషయాల మీదికి మనసుపోకుండా ఎరుకరూపులై విచారణచేయాలి. మంత్రమన్నా మాటే, మాయ అన్నా మాటే. భావవైరుధ్యమేర్పడినప్పుడు మాటద్వారానే పరిష్కరించుకొని ఆ భావాన్ని సరిచేసుకోవాలి. వాదానికి వాదము పరిష్కారము కాదు. పరిష్కారముకొరకు వాదంచేయాలి.

## ఎరుక పోతుందా?

మేను మిథ్య, నేనే ఎరుకయని, నేను మేనులను రెండుగా విభజించి, మేనును మిథ్యజేసి నేనును నిలిపి విచారించేది అద్వైతము. మేనే ప్రపంచము. నేనే ఆత్మ లేదా బ్రహ్మము. **ఆద్యారోప అపవాదంచ నిష్ప్రపంచం ప్రపంచతే'** బ్రహ్మమునందు ప్రపంచము పుట్టలేదు. అది నిత్యము నిరాకారము, అవ్యయమైన బ్రహ్మమునందు ఏ వికారములు లేకుండానే ప్రపంచము పుట్టినదని, లయమగుచున్నదని అరోపించబడుచున్నది. రజ్జువు యందు ఏర్పడిన సర్పభ్రాంతే ప్రపంచం. ఆరోపిత సర్పాన్ని అపవాదముచేసినప్పుడు వాస్తవమైన రజ్జువే మిగులుతుంది. అలాగే అరోపించబడిన ప్రపంచము బాధితమై నిర్వికార నిర్గుణ బ్రహ్మమే ఉంటుంది. సర్పారోపణకు కారణమైన వస్తువు రజ్జువేకాని అన్యమైనదానియందు ఆరోపించుటకు కుదరదు. సర్పారోపణకు రజ్జువు అధిష్టానమైనట్లు, ప్రపంచారోపణకు బ్రహ్మమే అధిష్టానము.ఈ విధమైన అధ్యాస విచారముచేసేది అద్వైతము. అధిష్టానమ, ఆధారము అయిన ఆత్మయందే ఆరోప అపవాదములు. వీటిని కూడా **'సర్వఖల్విదంబ్రహ్మ'** అన్న వాక్యంచేత జగత్తుకు పరిష్కారాన్ని చూపినారు అద్వైతులు.ఇక జీవున్ని, ఈశ్వరున్ని పరిష్కరించాలి. దీన్ని నిరూపించుటకు తత్వమసి వాక్యముద్వారా జీవేశ్వరైక్యము ప్రతిపాదించినారు. అప్పుడు జీవేశ్వరభ్రాంతి తొలగి అఖండ బ్రహ్మకారవృత్తి ఏర్పడుతుందనేది అద్వైతుల భావన.

అద్వైతులు దేన్ని బ్రహ్మమన్నారో, అచలులు దాన్ని ఎరుకని అన్నారు. శ్రీమద్భాగవత క్రిష్ణదేశికులు ఎరుక న్విచనమును తన కందార్థములలో

**కం॥ పరిపూర్ణ మొకటిదక్క ని౹తరమైన ప్రపంచమెల్ల తగదెలియుము నీ౹ వెరుకేనని మదిలోపల ।**
**యెరుకే పరిపూర్ణమెరిగే దెరుకానెరిగేదీ॥యింక్కొటిలేదీ రెంట్నేరిగేదీ॥**

ప్రత్యక్షమైన ఎరుకవునీవై, పరోక్షమైన బయలును గురువుచేత గుర్తెరుగాలి. గుర్తెరిగిన ఎరుక అప్పుడు, తాను అసత్యమైనదానినని గుర్తెరిగి మృషవుతుంది. అందుకే

**కం॥ అపరోక్షమౌనె మనుజుల౹కు పరోక్షంబైన బయలు గురుకృప లేకన్౹ అపరోక్షమౌను మనుజుల౹కు పరోక్షంబైన బయలు గురుకృప గలగా॥ కీలిదె లేనియెరుకా తాదొలుగా॥** అని సెలవిచ్చినారు. దీన్నే శ్రీభీమయార్యులవారు **కం॥ వొంటుకు దాపల బింద్వోం౹ట్లంటిచిన కొలదిలెక్క అధికంబగు నా౹ వొంటుకు వలపల బింద్వోక౹ టంటించిన లెక్కవుళ్ళక్యోగదనోయీ॥ వొంటుండి లేందొగద నోయీ॥తంటాదీరును చూడు దానివలెనె యెరుకకంటె౹ బయలును తానుగలిగుండి తనకు ళ్ళక్యోగదనోయీ॥వొంటుండి లేందొగదనోయీ॥** అనే కందార్థముద్వారా వివరించేవారు. అందుకే ఎరుక ఉంటుందా? అంటే ఉండిలేనిదవుతుందని చెప్పేవారు.

మనస్సు సత్వగుణ సమిష్టి ఇంద్రియము, జ్ఞానేంద్రియములు సత్వగుణ వ్యష్టి ఇంద్రియములు, అదేవిధంగా కర్మేంద్రియములు రజోగుణ వ్యష్టి ఇంద్రియములు. శ్రవణేంద్రియముద్వారా వినటమనేదేది సత్వగుణము. వాగేంద్రియముద్వారా మాట్లాడటం అనేది రజోగుణము. కాబట్టి వినుట అనేదే శిష్యుని ప్రథమ కర్తవ్యము. శ్రీభీమయార్యులవారికి వేలమంది శిష్యులున్నా,వేలమంది శిష్యులకు తాను గురువైనా నాలాంటి చిన్న పిల్లలు క్లాసులో చెబుతుంటే చక్కగా కూర్చొని, అభిమాన రహితంగా వినేవారు. చెపేటప్పుడు గురువని, వినేటప్పుడు శిష్యుడని గుర్తెరిగేదే, రెండు విధాలుగా ఉన్నదని చెప్పేవారు. తను, మన, ధనములు దారపోసిబోధ వినాలి. అదేవిషయాన్ని గీతలో మూడు విషయాలుగా చెప్పినారు.

**శ్లో॥ తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా**

**ఉపదేక్ష్యంతితే జ్ఞానం జ్ఞానిన తత్వదర్శినః॥**

1) ప్రణిపాతము 2) పరిప్రశ్న 3) సేవ. ప్రణిపాతమంటే కాళ్లమీద పడడటం, పరిప్రశ్న అంటే చక్కగా ప్రశ్నించ టం, సేవచేయటవలన తత్వమును దర్శించిన గురువులు, నీకు జ్ఞానాన్ని ఉపదేశిస్తారు. ఉపదేశాన్ని శ్రద్ధకలిగి ఇంద్రియ నిగ్రహముకలిగి వినాలి. విన్నదాని తాత్పర్యము మనసునంతా నింపుకొవాలి. అప్పుడా మనసుకు తనవృత్తి రహితమై ఆ విషయాకారవృత్తి ఏర్పడుతుంది.

**శ్లో॥ శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరః సంయతేంద్రియః**

**జ్ఞానం లబ్ధ్వా పరామ్ శాంతిమచిరేణాధిగచ్ఛతి॥**

**శ్రద్ధావాన్** శ్రద్ధగలవాడు, **సంయతేంద్రియః** ఇంద్రియములు చక్కగా నియంత్రించినవాడు, **తత్పరః** ఆ విషయములయందు మనస్సును సంచరింపజేయువానికి, **జ్ఞానం లబ్ధ్వా** జ్ఞానం లభించి, పరమైన శాంతిని పొందుతాడు.

శ్రీభీమయార్యులవారు భౌతికంగా మనమధ్య లేనప్పటికి వారి భావాలు మన మనోపలకాలపై ప్రతిఫలిస్తునే ఉన్నాయి. కుటుంబసభ్యులకు మనోధైర్యాన్నోసగాలని గురుపరమాత్మను ప్రార్థిస్తున్నాను.